# సింహం పెళ్ళి



చిట్టిచిట్టి కథలు



నాగభైరవ దేశింగరావు





ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
హైదరాబాద్

SIMHAM PELLI - Short Stories
By : NAGABHAIRAVA DESINGA RAO
Published by : Director & Special Officer, A.P. Baalala Akademi,
c/o Jawahar Bal Bhavan, Public Gardens, Hyderabad-500 004.

ప్రచురణ సంఖ్య : 78
మొదటి ముద్రణ : 1992
ప్రతులు : 5000

వెల : రు. 5-00

ముఖచిత్రం : ఆనంద్. ఎ.వి.బి.ఎస్.
బొమ్మలు : శిష్ట్లా రామకృష్ణ

టైప్ సెట్టింగ్: ప్రసాద్ గ్రాఫిక్స్,
3-6-115/5, హైదర్‌గూడా,
హైదరాబాదు-500 029

ముద్రణ :
గ్రాఫిక్స్‌డెన్
హిమాయత్ నగర్,
హైదరాబాదు-500 029

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
జవహర్ బాలభవన్, పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాద్-500 004

# తొలి పలుకు

బాలలకు విద్యా వైజ్ఞానిక సాంస్కృతిక రంగాలలో క్రమ వికాసం కలిగించాలనే లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1976 లో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమిని స్థాపించింది. నాటి రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ప్రారంభం చేసిన బాలల అకాడమికి, నాటి విద్యా సాంస్కృతిక వ్యవహారాలశాఖ మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు తొలి అధ్యక్షులుగా ఉన్నారు. తన లక్ష్యసాధన కోసం బాలల అకాడమి చేపట్టిన పథకాలలో బాలసాహిత్య ప్రచురణ పథకం కింద పిల్లలకు మంచి పుస్తకాలు ప్రచురించే కార్యక్రమం ఒకటి.

ఈ శతాబ్దంలో తెలుగు భాషలో ఆధునిక సాహిత్యం మూడుపువ్వులు ఆరుకాయలుగా విలసిల్లుతున్న తరుణంలో పిల్లల గురించి ఆలోచిస్తున్నవారు బహు అరుదు. ఆ లోటును పూరించటానికి ఉత్తమ బాలసాహిత్యం అందించటానికి బాలల అకాడమి పూనుకొన్నది.

వివిధ వయోవర్గాల బాలల అవగాహన స్థాయికి తగినట్లు సరళమైన భాషలో, తేలిక పదాలలో కథలు, గేయాలు, గేయకథలు, బొమ్మల కథలు, జీవిత చరిత్రలు, నవలలు, వైజ్ఞానిక రచనలు ప్రచురించటం జరుగుతోంది. రాసిలో కాకుండా వాసిలో శ్రద్ధ వహించి, బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించి, వారికి ఉత్తమ బాలసాహిత్యం అందించటమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొన్నది బాలల అకాడమి.

అమృత తుల్యమైన బాలసాహిత్యాన్ని వివిధ కోణాలలో వివిధ భావదీప్తులను వెలారించగల విభిన్న ప్రక్రియలలో గల బాలసాహిత్యాన్ని, ఒక్కమాటలో చెప్పాలంటే - బాలసాహిత్య సర్వస్వాన్ని ప్రచురించాలనే సదుద్దేశంతో వెలువరించిన పుస్తకాలలో ఇది ఒకటి.

ముందు ముందు కూడా బాలలకు ఆసక్తి కలిగించే సామాజిక వైజ్ఞానిక సాహసోపేత రచనలను కూడా తెలుగు బాలలకు అందించాలనుకుంటున్నాము. బాలల సర్వతోముఖాభివృద్ధిని, వారి మానసిక వికాసాన్ని ఆకాంక్షించే ఉత్తమ అభిరుచిగల తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు - బాలల అకాడమి చేస్తూన్న ఈ కృషిని బాలలకు అందుబాటులోకి తీసుకురావటానికి సర్వవిధాలా మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాము.

శారదా అశోకవర్ధన్
సంచాలకులు
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

## ఇందులో

# 1. సింహం పెళ్ళి

అడవికి దగ్గరలో ఒక చిన్న పల్లెటూరు ఉంది. ఆ ఊళ్ళో మాధవయ్య అనే పేదవాడు ఉన్నాడు. అతను, అతని భార్య ప్రతిరోజు అడవికి పోయి కట్టెలు కొట్టి తెచ్చేవారు. బస్తీలో వాటిని అమ్ముకొని జీవించేవారు.

వారికి ఒక్కతే కూతురు. పేరు విజయ. కొడుకులు లేరు. ఆమెకు యుక్తవయస్సు వచ్చింది. ఆమె చాల అందంగా ఉంటుంది.

ఒకసారి మాధవయ్య భార్యకు జబ్బు చేసింది. ఆమె చాల రోజులు పనిచేయలేక పోయింది. అందుచేత మాధవయ్య పనిలో తనకు సాయపడేందుకు విజయను కూడా తనతో అడవికి తీసుకుపోతున్నాడు.

ఒకరోజు అడవిలో వారు కట్టెలు కొడుతున్నారు. వారి దగ్గరకు ఒక సింహం వచ్చింది. దాన్ని చూచి మాధవయ్య, విజయ అదరిపోయారు. తప్పించుకుని పారిపోయే మార్గం కనిపించలేదు. వారు తమకు చావు తప్పదని తలచారు.



ఇంతలో ఆ సింహం "మాధవయ్యా! నీ కూతురిని నేను ప్రేమించాను. ఆమెను పెండ్లాడ దలచాను. ఆమెను నాకిచ్చి పెండ్లి చేయువా?" అని అడిగింది.

మాధవయ్యకు ఏమి చెప్పటానికి తోచలేదు. అందుచేత అతడు "నా భార్యతో ఆలోచించి రేపు చెప్తాను" అన్నాడు. అప్పటికి తప్పించుకున్నాడు. సింహం "సరే" అని వెళ్ళిపోయింది.

మరునాడు సింహం వారి వద్దకు వచ్చింది. దాన్ని చూచి మాధవయ్య "మృగరాజా! అమ్మాయిని నీకిచ్చి వివాహం జరపటానికి అంగీకరిస్తున్నాను. కాని పెళ్ళి మాత్రం మా ఆచారం ప్రకారం జరగాలి" అని అంటూ "రెండు షరతులకు నీవు అంగీకరిస్తే వెంటనే మీ యిద్దరికే పెళ్ళి జరిపిస్తాను" అన్నాడు.

"మీ ఆచారప్రకారమే పెళ్ళి జరపండి. ఆ షరతులేమిటో ముందుగా చెప్పండి" అంది సింహం.

"అమ్మాయిని పెంచి పెద్దదాన్ని చేశానుకదా! అందుకు నాకు చాల ధనం ఖర్చు అయింది. అందుచేత నాకు కొంత ధనం నీవు ఇవ్వాలి" అన్నాడు మాధవయ్య

"తప్పక ధనం ఇస్తాను" అంటూ సింహం తన గుహవద్దకు పరుగెత్తింది. సంచినిండా ధనం బంగారం తెచ్చి మాధవయ్య కిస్తూ "రెండవ షరతేమిటి"అంది.

మాధవయ్య తన కూతురి వంక చూపుతూ "ఈమెకు నీ గోళ్లు, కోరలు చూస్తే భయంగా ఉందట నీవు అంగీకరిస్తే వాటిని కూడ పీకుతాను. ఆ వెంటనే పెళ్ళి జరిపిస్తాను" అన్నాడు మాధవయ్య.

ఎదురుగా అందమైన అమ్మాయి కనిపిస్తుంటే ఆమెపై మోజుతో సింహం అందుకు అంగీకరించింది.

మాధవయ్య పట్టకారుతో దాని గోళ్ళు, కోరలు పీకివేశాడు. సింహానికి నోటి నుండి వేళ్ళనుండి నెత్తురు కారుతుంది. బాధ భరిస్తూనే "త్వరగా పెళ్ళి జరిపించండి" అంది మాధవయ్యతో

అందుకు మాధవయ్య "మా ఆచారప్రకారం పెళ్ళి కుమారునికి ముందుగా బడితెతో పెళ్ళి జరుపుతారు" అని ఒక గట్టి కర్రతో సింహాన్ని ఎడాపెడా బాదాడు. గోళ్ళు, పళ్ళు లేవు గదా! సింహం ఏమీ చేయలేక, దెబ్బలు భరించలేక అడవిలోకి పారిపోయింది.

సింహం ఇచ్చిన బంగారంతోను, ధనంతోను విజయకు మంచి సంబంధం చూచి వివాహం జరిపాడు మాధవయ్య. తను, తన భార్య ఆమె వద్దనే సుఖంగా చాలాకాలం ఉన్నారు.

*

"ఆశాపీడితులకు ఆపదలు తప్పవు"

# 2. గడుసు బాలుడు

గంగులు పెద్ద గజదొంగ. బుర్ర మీసాలు. ఎర్రని కనులు, ఎడమ చేతికి దండ కడియం. గళ్ళ లుంగీ, వెడల్పాటి పట్టీ. ఓ చురకత్తి. తుమ్మ మొద్దులాంటి నల్లని శరీరం. గున్న ఏనుగులాంటి ఆకారం. వాడిని చూస్తే పిల్లలు జడుసుకుంటారు. వాడిమాట వింటే పెద్దలు హడలిపోతారు.

"మీ ఇంట్లో ఈ రోజు దొంగతనం చేస్తాను" అని ముందుగా చెప్పి మరీ దోచుకుంటాడు గంగులు. ఎవరైనా అడ్డం వస్తే వారి నెత్తురు కళ్ళ చూస్తాడు. కరుణ చూపకుండా చంపుతాడు. వాడు అడవిలోనే కాపురం ఉంటాడు.

ఒకరోజు గంగులు రామాపురమనే గ్రామం వెళ్ళాడు. ఒక ధనవంతుని ఇల్లు దోచాడు. దొరికినదంతా మూట కట్టుకొని అడవిలోకి పోతున్నాడు.

ఆ దారిలో ఒక బావి ఉంది. ఆ బావి అంచుపై ఒక పిల్లవాడు కూర్చుని బిగ్గరగా వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. గంగులు అక్కడకు వెళ్ళాడు.

"ఎందుకు ఏడుస్తున్నావు?" అని పిల్లవాడిని అడిగాడు.



"నా చేతిన ఉన్న బంగారు ఉంగరం జారి బావిలో పడింది. మా నాన్నకు తెలిస్తే నన్ను చంపుతాడు. నీకు దణ్ణం పెడతాను. దాన్ని బావిలోంచి తీసిపెట్టవా?" అని దీనంగా అడిగాడు.

గంగులుకి మనస్సులో ఆశపుట్టింది. ఆ ఉంగరం కూడ తీసుకుపోవాలనుకున్నాడు. తన నెత్తిపై ఉన్న మూట దించాడు. దాన్ని బావి పక్కన పెట్టాడు. "చిటికెలో నీ ఉంగరం తెచ్చి ఇస్తాను. ఈ మూటను చూస్తూ ఉండు" అని తాడు పట్టుకొని బావిలోకి దిగాడు. బుడుంగున నీటిలో మునిగాడు.

ఆ పిల్లవాడు గడుసువాడు. పెద్ద బండ ఎత్తాడు. నీటిపైకి తేలిన గంగులు నెత్తిపై సూటిగా దాన్ని వేశాడు. వాడి తల పగిలింది. పెద్దగా అరుస్తూ వాడు నీటిలో మునిగి పోయాడు.

పిల్లవాడు మూటతీసుకున్నాడు. గుట్టు చప్పుడు కాకుండా ఇల్లు చేరుకున్నాడు.

*

"తాడి ఎక్కేవాడిని తలతన్ను వాడుంటాడు"

# 3. గాలి మేడలు

ఒక పల్లెపడుచు రోజూ బస్తీలో పాలమ్ముకొని జీవించేది. ఒకనాడు ఆమె తలపై పాలకుండ ఉంచుకొని బస్తీకి పోతూ ఇలా ఆలోచించింది.

"ఈ పాలన్నీ అమ్మితే చాలా డబ్బు వస్తుంది. ఆ డబ్బుతో మూడు వందల కోడిగుడ్లు కొంటాను. వాటిని అన్నింటిని పొదగవేస్తాను. కనీసం రెండువందల యాభై కోడిపిల్లలు అవుతాయి. వాటిని పెంచి పెద్ద చేస్తాను. కోళ్లను అమ్మి ఆ డబ్బుతో మేకలు, గొర్రెలు కొంటాను. వాటిని బాగా మేపుతాను. కొన్నాళ్లకు ఆ మంద పెరిగి రెట్టింపు అవుతుంది. వాటిని కూడా అమ్మివేస్తాను. ఆ డబ్బుతో మంచి ఆవులు కొంటాను. ఆవులు ఈని కోడె దూడలను పెడతాయి. కోడెదూడల వ్యాపారంలో లక్షల రూపాయలు సంపాదిస్తాను. బోలెడు బంగారు నగలు కొంటాను. కోరిన పట్టు చీరెలు కొంటాను. బంగారు నగలు పెట్టుకొని పట్టు చీరె కట్టుకుంటే నేను అందంగా ఉంటాను.

నా అందాన్ని చూసి ఈ దేశపు రాకుమారుడు నన్ను పెళ్ళాడతాడు. పెళ్ళి అయిన తరువాత నేనూ, రాకుమారుడు గృహప్రవేశం చెయ్యాలికదా! తలుపు వద్ద అమ్మలక్కలు నన్ను పెళ్ళికొడుకు పేరు చెప్పమని అడుగుతారు. అప్పుడు నాకు సిగ్గుముంచుకొస్తుంది. వారు నన్ను మరీ మరీ బలవంతం చేస్తారు. ఆయన పేరు చెప్పమని.



మాట్లాడాలంటే కొత్త పెళ్ళి కూతురికి బిడియం కదా! అందుచేత నేను చెప్పనని తల అడ్డంగా ఊపుతాను," అనుకొంటూ తన తల అటూ ఇటూ ఊపింది. నెత్తిమీద ఉన్న పాలదుత్త జారి కిందపడి పగిలిపోయింది. పాలన్నీ నేల పాలయినాయి. ఆమె గాలి మేడలన్నీ కుప్పగా కూలిపోయాయి.

*

"ఉన్న స్థితిని మరచిపోయి ఊహాలలో విహరించకు"

# 4. జిత్తులమారి నక్క

ఒక నక్క పరాకుగా నడుస్తూ ఉంది. అది తటాలున పాడుబడిన బావిలో పడింది. నీళ్ళు లోతులేవు. బావి ఒడ్డుమాత్రం నిటారుగా ఉంది.

పైకి రావటానికి అది ఎన్నోసార్లు ఎగిరింది. దానికి గట్టు అంద లేదు. అది నిరాశపడి విలపిస్తూ నీటిలో నిల్చుంది.

అంతలో ఒక మేకపోతు అటుగా వచ్చింది. అది చాలా దప్పికగొని ఉంది. బావిలోనికి తొంగి చూచింది. "నీళ్ళు బాగున్నవా?" అని నక్కను అడిగింది.

నక్క తన దురవస్థను కప్పిపుచ్చుకుంటూ "పచ్చి కొంకాయ నీటి రుచి, చక్కెర పానకం రుచి, వీటి రుచి ముందు దిగ దుడుపే. ఒక్క గుక్క తాగితే నీకే తెలుస్తుంది. అయినా తాగబోతూ నన్ను రుచి అడగడమెందుకు. లోనికి దిగి తాగు." అని మేకను ప్రోత్సహించింది.

మేక బావిలోకి దిగింది. కడుపార నీరు తాగింది. అప్పుడు నక్క మేకతో "మన మిప్పుడు గొప్ప ఆపదలో చిక్కుకున్నాము. బయట పడటానికి ఒకే ఒక్క ఉపాయం ఉంది" అంది. "అదేమిటో చెప్పు వీలయితే అలాగే చేద్దాం" అంది మేక.



నీ ముందరి కాళ్లు గోడకానించి నిటారుగా నిలబడు. నేను నీపైకి ఎక్కి ఒడ్డు చేరుతాను. ఆ తరువాత నీ కొమ్ములు పట్టుకొని పైకి లాగుతాను" అంది నక్క.

మేక అలాగే చేసింది. దానిపైకి ఎక్కి నక్క ఒడ్డు చేరింది. "వెళ్ళొస్తా" అని బయలుదేరింది నక్క. "నన్ను పైకి తీయకుండానే వెళ్ళొస్తాను అంటావేమిటి" అని అడిగింది మేక.

నక్క వ్యంగ్యంగా "ఓసీ పిచ్చిదానా! బైటపడే మార్గం చూసుకోకుండా లోతు బావులలో దిగకు. అది చాలా ప్రమాదం" అంటూ తోక ఊపుకుంటూ వెళ్ళిపోయింది.

*

"ఆలోచించకుండా ఏపనీ చేయకు"

# 5. బాటసారులు

ఒక ఊళ్ళో భీమయ్య, కామయ్య ఇరుగుపొరుగున నివసిస్తూ ఉండేవారు. వారు ఎంతో స్నేహంగా ఉండేవారు. అవసరమైనప్పుడు ఒకరికొకరు సాయం చేసుకొనేవారు.

ఒకరోజు భీమయ్య తన పొలం వద్ద నీరు తోడుతూ ఉన్నాడు. అది నేల బావి. కాలుజారి బావిలో పడ్డాడు. అతనికి ఈతరాదు. దూరంనుండి కామయ్య ఇది గమనించాడు. పరుగుపరుగున అక్కడకు వచ్చాడు. ప్రాణాలకు తెగించి నీటిలో దూకాడు. భీమయ్యను రక్షించి ఒడ్డుకు చేర్చాడు.

మరోనాడు భీమయ్య, కామయ్య బస్తీకి వెళ్ళి తిరిగి వస్తున్నారు. వారికి కొద్దిదూరంలో ఒక ఎలుగుబంటు కనిపించింది. తప్పుకొనుటకు వ్యవధి లేదు. ఏమి చేయటానికి వారికి తోచలేదు. భయం వేసింది.

భీమయ్య గబగబ దగ్గరలో ఉన్న చెట్టు ఎక్కాడు. గుబురు కొమ్మలలో కూర్చున్నాడు.

కామయ్యకు చెట్టు ఎక్కటం చేతకాదు. ఎలుగుబంటు మరీ దగ్గరకు వచ్చింది. అతడు గబగబ ఆ చెట్టు పక్కన పడుకొన్నాడు. కదలలేదు. మెదలలేదు. శ్వాస బిగబట్టాడు. శవం వలె పడి ఉన్నాడు.



ఎలుగుబంటి కామయ్య వద్దకు వచ్చింది. అతని శరీరమంతా వాసన చూచింది. చివరగా చెవివద్ద ముక్కువద్ద తన మూతిని ఉంచింది. అతడు చనిపోయాడు అనుకుంది. ఎలుగుబంట్లు చచ్చినవారిని తినవు కదా! అందుచేత అది అక్కడ నుండి వెళ్లిపోయింది.

ఎలుగుబంటు దూరంగా వెళ్ళిన తరువాత భీమయ్య చెట్టు దిగాడు. కామయ్య వద్దకు వచ్చాడు. చేతితో అతనిని తట్టాడు. కామయ్య ఆ తట్టింది కూడా ఎలుగుబంటే అనుకున్నాడు. లేవకుండా పడుకున్నాడు. భీమయ్య తన స్నేహితుడు గుండె ఆగి చనిపోయాడేమో అనుకున్నాడు. అతనికి దుఃఖం ఆగలేదు. మనస్సు నిలువలేదు. "కామయ్యా" అని పిలిచాడు.

ఆ పిలుపుతో కామయ్యకు ప్రాణం లేచి వచ్చినట్లయింది. సంతోషంగా లేచి కూర్చున్నాడు. భీమయ్య సంతోషానికి కూడా హద్దులు లేవు.

అతనితో హాస్యంగా "కామయ్యా ఎలుగుబంటు నీ చెవిలో ఏదో రహస్యం చెప్పినట్లుంది. ప్రాణమిత్రుడనైన నాతో అది చెప్పవా?" అన్నాడు భీమయ్య.

దానికి కామయ్య "ఆపదలో ఆదుకొని రక్షించే వాడే నిజమైన మిత్రుడు. అలా కాక చెట్టు ఎక్కి కూర్చొనే వానితో స్నేహం చేయ వద్దు అంది ఎలుగుబంటి" అన్నాడు.

తను చేసిన తప్పు తెలుసుకున్నాడు భీమయ్య. సిగ్గుతో అతను తలదించుకొన్నాడు.

*

"ఆపదలో ఆదుకొన్నవాడే ఆప్తమిత్రుడు"

# 6. తోడేలు - కొంగ

అనగా అనగా ఒక తోడేలు ఉంది. అది ఒక కోడిపుంజును చంపితింది. పొడవాటి ఎముక ఒకటి దానిగొంతులో గుచ్చుకుంది. దాని గొంతు వాచి పోయింది. చీము పట్టి బాగా నొప్పి చేసింది. నీళ్ళు ఆహారం మింగటం దానికి కష్టంగా ఉంది.

అది చెట్టుపై ఉన్న కొంగ వద్దకు పోయింది. చెట్టు కింద కూర్చొని "కొంగబావా! కొంగబావా! నా గొంతులో ఎముక దిగబడి చాల బాధపెడుతుంది. నీకు మంచి బహుమతి ఇస్తాను. దాన్ని బయటకు తీసి నాప్రాణాలు కాపాడవా" అని బతిమలాడింది.

కొంగకు దానిపై జాలి కలిగింది. బహుమతికై అది ఆశపడింది. చెట్టుపై నుండి ఎగిరి తోడేలు ముందు వాలింది. తోడేలు నోట్లో తల దూర్చింది. తన పొడవైన ముక్కుతో ఎముకను బయటకు లాగింది.

ఆ ఎముకను చూచి తోడేలు చాలా సంతోషించింది. తల అటు ఇటు త్రిప్పి చూచుకుంది. నొప్పి ఏమి అనిపించలేదు. గొంతు సవరించుకుంది. గుటకవేసి చూచుకుంది. బాధ ఏమి అనిపించలేదు.

తోడేలు లేచి వెళ్ళి పోతోంది. కొంగ దానికి ఎదురుగా వెళ్ళి "నా బహుమతి మాటేమిటి?" అంటూ "కనీసం కృతజ్ఞతలు కూడ చెప్పకుండా వెళతావేం" అంది.



తోడేలు వికటంగా నవ్వింది. "ఓసి వెర్రిదానా! నా నోట్లో నీ తలదూర్చినప్పుడు నిన్ను చంపకుండా వదలటమే నేను నీకిచ్చిన పెద్ద బహూమతి నా ఎదుట ఇంతసేపు నిలబడి మాట్లాడనివ్వటమే నీకు చేసే కృతజ్ఞతలు" అంటూ "మరొక్క క్షణం ఇక్కడఉంటే నీప్రాణాలు నీకు దక్కవు" అంది తోడేలు కొంగతో. ఆ మాటవిని తెల్లబోయిన కొంగ మెల్లగా చెట్టుపైకి ఎగిరిపోయింది.

*

"దుష్టులకెప్పుడు సాయపడకు"

# 7. ప్రత్యుపకారం

రామయ్య పొలంలో ఒక పెద్ద వేప చెట్టు ఉంది. దాని కొమ్మలపై గద్ద ఒకటి తన పిల్లాపాపలతో సుఖంగా కాపురముంటోంది.

ఒకనాడు ఒక కోడెతాచు ఆ పొలం గట్టుపై జరజర ప్రాకుతూ పోతుంది. గద్ద రివ్వుమని ఎగురుతూ వచ్చి తన వాడి గోళ్ళతో గద్దపైకి తిరుగబడింది. రెంటికి పోరు ఘోరంగా సాగింది. పాము ధాటికి తట్టుకోలేక గద్ద వెనకడుగు వేసింది. అదే అదనుగా పాము గద్దను చుట్టువేసి గట్టిగా నొక్కసాగింది. గద్ద ప్రాణభయంతో బిగ్గరగా అరచింది.

అప్పుడే పొలానికి వస్తున్న రామయ్య వాటిని చూశాడు. గద్దపై జాలి తలచాడు. తన వద్ద ఉన్న కర్రతో పామును ఒక్క దెబ్బ వేశాడు. పాము గద్దను వదలి పారిపోయింది. గ్రద్ద చెట్టుపైకి ఎగిరిపోయింది.

తాచుపాము రామయ్యపై పగబట్టింది. ఎలాగైనా అతనిని చంపాలని అనుకుంది.

మధ్యాహ్నమయింది. రామయ్య తన అన్నపు దుత్త తీసికొని నీటికుంట వద్దకుపోయాడు. పాము అతనిని కనిపెట్టే ఉంది. అతని వెనుకనే కుంటవద్దకు చేరింది. కాటువేయటానికి దానికి అవకాశం దొరకలేదు.



రామయ్య దుత్తను ఒడ్డుపై ఉంచి కుంటలోకి దిగాడు. వంగి కాళ్ళు చేతులు కడుగుకొంటున్నాడు.

రామయ్యకు కనిపించకుండా పాము దుత్తలోకి విషం కక్కింది. ప్రక్కనే ఉన్న తుప్పలోకి తప్పుకుంది. చెట్టుపై ఉన్న గద్ద ఇదంతా చూచింది. తన ప్రాణాలు కాపాడిన రైతుకు ఉపకారం చేయాలను కుంది. నీటి కుంటపై ఎగురుతూ ఉంది.

రామయ్య దుత్తవద్దకు వచ్చాడు. కూర్చొని దుత్త చేతిలోకి తీసు కున్నాడు. అన్నం కలుపుకుంటున్నాడు. గద్ద ఒక్క ఉదుటున వచ్చి దుత్తను తన్నింది. రామయ్య చేతిలోని దుత్త జారి కిందపడింది. అన్న మంతా నేల పాలయింది. రామయ్య గద్దను తిట్టుకుంటూ లేచి నిలబడ్డాడు.

అప్పుడే అక్కడకు వచ్చిన కుక్క కిందపడ్డ అన్నం తిన్నది. వెంటనే అది నురుగులు కక్కుతూ తన్నుకొని చచ్చింది.

అది చూచిన రామయ్య గద్దను తిట్టినందుకు బాధపడ్డాడు. తన ప్రాణం కాపాడినందుకు దానికి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

*

"ఉపకారము చేసినవారికి ప్రత్యుపకారము చేయాలి"

# 8. రైతు - నక్క

ఒక కాపువాడు పంటచేను పక్కన కొష్టమును కట్టి తన ఎద్దులను అక్కడనే కట్టివేస్తున్నాడు. పెంపుడు కోళ్ళను కూడా అక్కడనే గంప కింద కమ్మివేస్తున్నాడు. చీకటి పడగానే అతడు ఇంటికి వెళ్ళి భోజనం చేసివచ్చి అక్కడనే నిద్రిస్తున్నాడు.

ఒక టక్కరి నక్క ఇదంతా గమనించింది. కోళ్ళను తినాలనుకుంది. పగలంతా పంట చేలో నక్కి కూర్చుంది. రైతు భోజనానికి వెళ్ళటం గమనించింది. అది కొష్టములో దూరి గంప ఎత్తింది. బాగా బలిసిన కోడిపుంజును నోట కరచుకొని పొలాలలోకి వెళ్ళింది. దాన్ని చంపి భుజించింది.

మరునాడు ఉదయాన్నే రైతు కోడిపుంజు లేకపోవటం గమనించాడు. దాన్ని ఎవరు దొంగిలించింది అతడు ఊహించలేకపోయాడు. ఆ సాయంత్రం ఇంటికి వెళ్ళినట్లే వెళ్ళి వెంటనే తిరిగి వచ్చాడు. నక్క మరోకోడిని తీసుకపోవడం రైతు తన కళ్ళారా చూశాడు.



నక్కను వదలకూడదనుకున్నాడు. వదిలితే తన కోళ్ళు తనకు దక్కవనుకున్నాడు. మూడవనాడు అతడు కోళ్ళతోపాటు గంపకింద కూర్చున్నాడు.

అలవాటుగా నక్క వచ్చి గంప ఎత్తింది. రైతు దాన్ని గట్టిగా పట్టుకున్నాడు. దాన్ని చంపాలని తలచాడు. పాపభీతి అతనికి అడ్డం వచ్చింది. దాన్ని బాగా భయపెట్టి వదులుదామనుకున్నాడు.

నక్క తోకచుట్టూ నూనెతో తడిపిన గుడ్డలు చుట్టాడు. నిప్పు అంటించి దానిని వదలి వేశాడు.

అతని చేను బాగా పండి ఎండి ఉంది. నక్క ఆ చేనుకు అడ్డంగా పరుగులు తీసింది. దాని తోక మంటలు పంట చేనుకు అంటుకున్నాయి. అది పూర్తిగా తగులబడిపోయింది.

రైతు తనను తాను తిట్టుకున్నాడు. దుష్టునిపై జాలి తలచి వదలినందుకు తనకు తగిన శాస్తి జరిగిందనుకున్నాడు.

*

“దుష్టునిపై దయ తలచరాదు”

# 9. పిసినారి-పసిడిమూట

ఒక ఊళ్ళో పరంధామయ్య అనే పిసినారి ఉండేవాడు. అతడు ఎంగిలి చేత్తో కాకిని కూడా అదిలించేవాడు కాదు. కడుపునిండా భుజించడు. ఒంటినిండా బట్టలు కూడ ధరించడు. అతనికి పిల్లలు లేరు. భార్య మంచి చీర ధరించినా, మంచి కూర వండినా సహించేవాడు కాదు. అస్తమానం ఆమెను సాధిస్తూండేవాడు. అతని పిసినారి తనం భరించలేక ఆమె పుట్టింటికి వెళ్లింది.

పరంధామయ్య ఇరుగు పొరుగును నమ్మడు. బంధువులను దగ్గరకు చేరనివ్వడు. లంకంత ఇంట్లో ఒక్కడే ఉండేవాడు.

అతడు వడ్డీ వ్యాపారం చేసి బాగా డబ్బు సంపాదించాడు. క్రమేణ అతనికి ఓపిక తగ్గింది. వడ్డీలు సరిగ్గా వసూలు చేయలేక పోతున్నాడు. ఆ వ్యాపారం మాని వేశాడు. స్థలాలు, పొలాలు కూడా అమ్మివేసి డబ్బుగా మార్చాడు.

ఆ డబ్బంతా దాచటం అతనికి కష్టంగా తోచింది. అందుచేత దానితో బంగారం కొన్నాడు. తన ఇంట్లో బంగారం దాచడం కూడా అతనికి ప్రమాదంగానే అనిపించింది.



ఊరి వెలుపల పాడుపడిన బావి ఒకటి ఉంది. అటువైపు ఎవ్వరు వెళ్ళరు. తన బంగారం దాచటానికి అది తగిన స్థలం అనుకున్నాడు పరంధామయ్య. ఆ బావి పక్కన ఒక చిన్న పాదు తవ్వాడు. బంగారమంతా దానిలో దాచాడు. దానిపై గుర్తుగా ఒక రాతిని ఉంచాడు.

ప్రతిరోజు ఉదయం సాయంత్రం అక్కడకు వెళ్లేవాడు. పాదు తీసి బంగారం చూచుకొని మురిసిపోయేవాడు.

ఇలా కొంతకాలం జరిగింది. ప్రతిపూట పరంధామయ్య అక్కడకు పోయి రావటం ఒక దొంగ గమనించాడు. ఒకరోజు చాటుగా ఉండి అంతా చూశాడు. ఆ రాత్రికి బంగారం దొంగిలించాడు.

మరునాడు ఉదయం పరంధామయ్య పాదు త్రవ్వి చూచుకున్నాడు. బంగారం కనిపించలేదు. అతని గుండె ఆగినంత పని అయింది. నెత్తీ నోరు బాదుకుంటూ బిగ్గరగా ఏడవటం ప్రారంభించాడు.

"ఆ ఏడ్పువిని అటుగా పోతున్న ప్రతి ఉదయం సాయంత్రం దాన్ని చూచుకొని తృప్తిపడే వాడిని. ఎవరో దాన్ని దొంగిలించారు. ఇప్పుడెలా" అంటూ మరీ బిగ్గరగా ఏడ్చాడు పరంధామయ్య.

ఆ వచ్చిన ఒకడు "పాదుపై రాతిని లోపల ఉంచు. ఉదయం సాయంత్రం వచ్చి దాన్ని చూచి పోతూ ఉండు. బంగారాన్ని నీవేమైనా అనుభవించావా? ఇతరులకెవరికైనా ఇచ్చావా? అదేమిలేదు కదా! ఈ రాతినే బంగారమనుకొని తృప్తిపడు. నీకు బంగారం అయినా రాయి అయినా ఒకటే కదా?" అని చెప్పి వెళ్ళిపోయాడు.

*

"పిసినారి ధనం పరులపాలు"

# 10. ఉప్పు వ్యాపారి

ఒక ఉప్పు వ్యాపారి వద్ద రెండు గాడిదలు ఉండేవి. అతడు ప్రతి రోజు ఉప్పు కొటార్ల వద్దనుండి వాటిపై ఉప్పుతెచ్చి ఊరూరు తిరిగి అమ్ముకొనేవాడు.

ఒకనాడు అతడు గాడిదలపై ఉప్పు బస్తాలువేసి తోలుకుని వస్తు న్నాడు. వాటిలో ఒకటి అతి తెలివిగల గాడిద.

అవి వచ్చే తోవలో ఒక కాలువ ఉంది. అక్కడకు రాగానే ఆ గాడిద మెదడు చురుకుగా పనిచేసింది. కాలుజారినట్లుగా నీటిలో పడింది. లేవటానికి ప్రయత్నిస్తున్నట్లుగా అటు ఇటు పొర్లింది. ఉప్పంతా తడిసిపోయింది. నీటిలో కరిగిపోయింధి. తరువాత మెల్లగా అది లేచింది. దానికి బరువు బాగా తగ్గింది. అది వడివడిగా నడుస్తూ రెండవ గాడిదతో "తెలివి తేటలుంటే ఏమయినా చేయవచ్చు. నేనెలా బరువు తగ్గించుకున్నానో చూశావా?" అంది.

మరుసటిరోజు కూడా అది అలాగే చేసింది. వ్యాపారి దాని టక్కరి తనాన్ని గమనించాడు. దానికి బుద్ధి చెప్పాలనుకున్నాడు. ఒక ఉపాయం ఆలోచించాడు.



మూడవరోజు దాని వీపుపై పెద్ద కచ్చికలబస్తా వేశాడు. కచ్చికలు చాలా తేలిక కదా! అయినా ఆ గాడిద తన గుణం మార్చుకోలేదు. కాలువలో పడి అటు ఇటు పొర్లింది. కచ్చికలు నీరు పీల్చుకున్నాయి. దానిపై ఉన్న బరువు ఇబ్బడి ముబ్బడిగా పెరిగింది. అది నడవలేక నడవలేక నడవసాగింది.

రెండవగాడిద దాన్ని చూచి "నీ అతి తెలివికి వ్యాపారి చక్కగా బుద్ధి చెప్పాడు," అంటూ హేళనగా నవ్వింది. మొదటి గాడిద సిగ్గుతో తలవంచుకుంది.

*

"అతితెలివి కెప్పుడును అధిక కష్టము తప్పదు"

# 11. సౌభాగ్యలక్ష్మి

ఒక అడవి ఉంది. అందులోని ఆడ జంతువులన్నీ ఒకనాడు సభ చేశాయి. ఎక్కువ సంతానం కన్న తల్లికి "సంతానలక్ష్మి" బిరుదు ఇచ్చి ఘనంగా సన్మానం చేయాలి అని తలచాయి.

ఒక్కొక్క జంతువే వేదిక ఎక్కి తాను కన్న సంతానాన్ని గురించి చెప్పటం ప్రారంభించాయి.

కుక్క వేదిక ఎక్కింది. అది "నేను ఒక్కొక్క కాన్పుకు ఏడుగురు సంతానాన్ని కంటున్నాను. ఆ బిరుదు నాకే ఇవ్వాలి" అంది.

తరువాత పంది వేదిక ఎక్కింది. "కుక్కకంటే నేను ఎక్కువ సంతానం కంటున్నాను. ఆ బిరుదు నాకే ఇవ్వాలి. సన్మానానికి నాకే అర్హత ఉంది" అంది.

ఆ సభకు సింహం కూడా వచ్చింది. అది కూడా వేదిక ఎక్కింది. "నేను ఒక్కరు లేక ఇద్దరిని కంటాను. అయినా ఆ బిరుదు నాకే ఇవ్వాలి" అంది.



"ఎందుకివ్వాలి" అని ఎదురు ప్రశ్న వేసింది పంది. "మీరు డజన్లకొద్దీ సంతానం కంటున్నారు. వారికి సరైన తిండి పెడు తున్నారా? సరైన వసతులు చూపుతున్నారా? సరిగ్గా విద్యాబుద్ధులు నేర్పుతున్నారా? క్రమశిక్షణతో పెంచుతున్నారా?" అని ప్రశ్నించింది.

మరలా "మీరు కన్నవారిని రొచ్చుగుంటల్లో ఉంచుతున్నారు. చెత్తా చెదారంలో పొర్లాడమంటున్నారు. అడవి తల్లికి భారంగా తయారు చేస్తున్నారు. నీటికీ, తిండికీ, వసతికి అన్నిటికి కరువు మీలాంటి వారి వల్లనే వస్తుంది," అని అంది సింహం.

"నా బిడ్డలు చూడండి. క్రమశిక్షణలో పెరుగుతున్నారు. బల పరాక్రమం కలిగి ఉంటున్నారు. తెలివి తేటలతో మీ అందరికి ప్రభు వులుగా అవుతున్నారు. అలాంటివాడు ఒక్కడయితేనేమి చాలడా?" అంది సింహం.

మిగతా జంతువులన్నీ నిజం తెలుసుకున్నాయి. తలలు వంచుకు న్నాయి. ఆడ సింహానికి ఘనంగా సన్మానం జరిపి "సంతానలక్ష్మి" కాదు "సౌభాగ్యలక్ష్మి" అని బిరుదు ఇచ్చాయి.

*

"ఒక్కరు లేక ఇద్దరుచాలు"

# 12. రెంటికి చెడ్డ రేవడు

ఒక కాకి ఉంది. అది మహా సోమరి. కష్టపడకుండా బతకటం ఎలా అని ఆలోచించింది. దానికి ఒక ఆలోచన తట్టింది. తెల్లని పెంపుడు పావురాళ్ళ గూటిలో చేరితే కష్టపడకుండా కమ్మటి ఆహారం దొరుకుతుంది అనుకుంది. తన రంగు చూచుకుంది. నల్లగా ఉంది. ఎలా అని ఆలోచించింది. దానికి ఒక ఉపాయం తోచింది. వెంటనే ఒక సున్నపు గాబు వద్దకు పోయింది. దానిలో దిగి అటు ఇటు పొర్లాడింది. పైకి వచ్చి తనను తాను చూచుకుంది. తను తెల్లగా ఉంది. తన తెలివికి తనను తానే మెచ్చుకుంది.

అది పెంపుడు పావురాల వద్దకు చేరింది. అవి దాన్ని తెల్లపావు రంగా భ్రమించాయి. తమతోపాటు గూటిలో ఉంచుకున్నాయి. తమ ఆహారంలో దానికి భాగం ఇస్తున్నాయి. కాకి వాటితో కలసి సుఖంగా ఉంటోంది.

ఇలా కొన్నాళ్ళు గడిచింది. ఒకనాడు కాకి ఏమరుపాటుగా "కావు కావు" మని బిగ్గరగా అరిచింది. అది విన్న పావురాళ్ళు దాన్ని ముక్కులతో పొడిచి గూటినుండి తరిమివేశాయి.

తప్పనిసరై అది కాకుల వద్దకు చేరింది. తెల్లని ఈకలున్న దానిని చూచి మిగతా కాకులు "ఇది కొత్త జాతి పక్షి" అని అనుకున్నాయి. దాన్ని తమతో ఉంచుకోవటానికి అవి ఇష్టపడలేదు. దాన్ని ముక్కులతో పొడిచాయి. గోళ్ళతో రక్కాయి. చివరకు అది రెంటికి చెడ్డ రేవడిలా అయింది.

*

"నైజ గుణము మారునా వేష మెంత మార్చినా"



# 13. గాడిద - తోడేలు

అనగా అనగా ఒక గాడిద. ఒకనాడు అది పచ్చిక బయల్లో మేస్తూ ఉంది. అంతలో ఒక తోడేలు అటుగా వచ్చింది. గాడిదను చూచింది. దాన్ని తినాలని తోడేలుకు నోరు ఊరింది.

తోడేలు తనవద్దకు రావటం గాడిద చూచింది. అది తన వెనుక కాలు కుంటుతూ నడవ సాగింది. బాధను అభినయించింది.

తోడేలు గాడిద వద్దకు చేరింది. ఎగిరి దానిపై దూకబోయింది. "ఒక్క క్షణం ఆగు తోడేలు బావా. నా వెనుక కాల్లో పెద్ద ముల్లు విరిగింది. నీవు నన్ను తినేటప్పుడు అది నీ గొంతులో గుచ్చుకుంటుంది." అంది గాడిద.

"అయితే ఇప్పుడు ఎలా?" అంది తోడేలు. "నీవు నా కాల్లో ముల్లు మెల్లగా లాగేయ్. ఆ తర్వాత నన్ను తిను" అంది గాడిద.



ఆ అమాయకపు తోడేలు గాడిద వెనుక కాళ్ళ వద్ద కూర్చుంది. ముల్లుకోసం దాని పాదాన్ని జాగ్రత్తగా పరిశీలించసాగింది.

అదను చూచి గాడిద, తోడేలు మూతిపై వెనుక కాళ్ళతో ఒక్క తన్ను తన్నింది.

ఆ తన్నుకు తోడేలు ముందు పళ్ళు రెండు రాలాయి. బాధతో అరుస్తూ అది విరుచుక పడింది.

గాడిద పరుగు లంకించుకుంది. తన ప్రాణాలను రక్షించుకొని పారిపోయింది.

*

"ఉపాయంతో అపాయాన్ని తప్పించుకోవచ్చు"